**Regd No.** N. / M. 3289

# గోలకొండపత్రిక

103267

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

| సంపుటము ౧౨ | హైద్రాబాదు-దక్కన్ ౧ ఆబాన్ ౧౩౪౬ ఫ.<br>శా. శ. ౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర భాద్రపద శు. ౨ సోమవారము | సంచిక ౩౪ |
|---|---|---|



## కావలెను

ఈక్రింది స్థలములందు "గోలకొండ పత్రిక" విక్రయించుటకు పలుకుబడిగల యేజంట్లు కావలయును. వెంటనే వివరములకు వ్రాయుడు:—

భువనగిరి, మట్టెవాడ, నల్లగొండ, కరీంనగరము, జనగాము, మహబూబునగరం.

మేనేజరు

గోలకొండపత్రిక

## వధువుకావలెను

౨౩ సంవత్సరముల వయస్సుగలిగి భూవసతియు, స్వతంత్రజీవనముగల ఆరువేల నియోగి బ్రాహ్మణునకు, బ్రాహ్మణులలో యేశాఖకు చెందినను, వితంతువైనను, ౧౨ నుండి ౨౦ సంవత్సరముల వయస్సుకు లోబడిన వధువు కావలెను. ఉత్తరములు రహస్యముగా యుంచబడును.

వివరముల

మేనేజరు
గోలకొండపత్రిక
హైదరాబాదు




# గోలకొండపత్రిక

ఈశ్వరనామ సం॥ర భాద్రపద శు॥ ౩

సోమవారము


## ప్రభువుగారి పుట్టిన దినము

రాష్ట్రమంతటను మన ప్రభువరేణ్యులగు మ. ఘ. వ. (సప్తమనైజాం) నవాబ్ సర్ మీర్ ఉస్మానలిఖాన్ బహద్దర్ గారి ౫౩ వ జన్మదినోత్సవము జరుపబడును. ఈ యుత్సవము యథాప్రకారము అధికారులకేగాక అనధికారులకు, జనసామాన్యమునకు సంతోషావహము. ఈ సంతోష మధికమగుటకనేక సమ్మిళిత కారణములు గలవు.

ముఖ్యముగా పేర్కొనదగినది విద్యావిధానపు మార్పు. స్వతంత్ర జీవనోపాధికి ప్రకృతుల కనుగుణ్యముగు వివిధ వృత్తివిద్యల పర్పాటులేక సామాన్యముగ నొక్క సాహిత్యవిద్య [Likerary Education]యుండుటచే భారతదేశమందంతటను నిరుద్యోగము ప్రబలుటు గాంచి మనరాష్ట్రమునందీ భీభత్స మంతరింపజేయుటకు యేర్పరచిన మెకంజీ కమిటి నివేదిక, ప్రభుత్వము వారి మార్పులతో గత సంవత్సరమే ప్రభువుగారి ఆమోదము బడసినది. దానికి కార్యరూపము కలిగించుట కేర్పడిన సెకండరీ విద్యా సంఘము [Board of Secondary Education] ప్రథమ సమావేశము దీనికనుగుణ్యముగా స్త్రీవిద్యకై హైదరిసతిగారి అధ్యక్షతన మఱియొక సంఘము మేర్పరచబడినది. ఇట్లే ఇంకను ఇతర కార్యక్రమము సాగుచున్నది. ఎనిమిది మాసముల కు పూర్వము రాష్ట్రమందు పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుటకై ఏర్పరచబడిన కమిటీయు, త్వరలో తయారు కాబడునున్నదని ఇపుడిపుడే తెలియుచున్న పరిశ్రమాభివృద్ధి విధాన ప్రణాళికయు కాలక్రమమున రాష్ట్రమందు అవకాశముగల పరిశ్రమల స్థాపనకు త్రోవజూపి, క్రొత్త విద్యావిధానము ప్రకారము పర్పాటుచేయబడు పారిశ్రామిక విద్యనేర్చుకొనువారలకు నిరుద్యోగము సంభవించకుండ జేయుగలవు. పరిశ్రమాభివృద్ధియనిన ప్రభువుగారి కెంత యిష్టమో, వారు గడచిన బహిమన్, నెల ఆఖరున హైద్రాబాదు నగరములో జరిగిన ౨౪ వ అఖిలభారత సైన్సు సమావేశమునకు పంపిన సందేశములో ఉస్మానియా విద్యాపీఠము ముందు మెట్టులోనున్న ఇతర విద్యాపీఠములతో పాటు సైన్సు అభివృద్ధికై ఎక్కువ కృషిచేయవలెననిన మాటనుబట్టి తెలియగలదు.

ఇటీవల ప్రభుత్వము, ప్రజలను ఆకర్షించిన సమస్యలలో ఫెడరేషన్ ఒకటి. నూటికి ౫ యందు మాత్రము చదువను వ్రాయను తెలిసియుండు ఈ రాష్ట్రములో ఫెడరేషన్ గురించి అంతగా తెలుసుకొనుటకు ప్రయత్నింపకుండుట చిత్రముగాదు. అట్లు ఫెడరేషనును గూర్చి కొద్దియో గొప్పయో ఆలోచించు వారలు, ఫెడరేషనులో చేరుటవలన మన రాష్ట్రము ఇపు డనుభవించుచున్న టప్పామున్నగు లాభకరములైన సౌకర్యములను పోగొట్టుకొన వలసివచ్చునని భయపడుచున్నారు. అట్టి వారిలో కొందరు ప్రభుత్వమువారి నడుగగా, ప్రభుత్వమువారు టప్పా నాణ్యములు మున్నగునవేవియు వదలుకొనకయే ఫెడరేషనులో చేరుటకు రాయబారములు నడుపబడుచున్నవని చెప్పి పంపిరి. ఈ సమాధానము దయామయులగు ప్రభువుగారి అనుగ్రహము లేనిది, పోయిన బహిమన్ నెలలో ప్రజలకు వెల్లడియగుటు యుండునా యనునది సందేహము, త్వరలో ఇంతవరకు ఫెడరేషను విషయమై జరిగిన సంప్రతింపుల ఫలితములు ప్రకటించ బడునుండుటయు ఈ అనుగ్రహఫలమే. రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీగారు ప్రధానమంత్రి పదవి స్వీకరించినపుడు తమ కన్నిమతములును సమానమని చెప్పియుండిన మాటకు సంతోషించి కొందరుహిందూ నాయకులు వారిసన్నిధికిపోయి, ప్రభుత్వోద్యోగములలో హిందువులసంఖ్యకు తగిన దానికంటె చాల తక్కువగా నుండుటకు పక్షపాతమే మైన కారణమా యని సూచించగా, హైదరీగారు, అట్టి పక్షపాతము ప్రభుత్వవిధానమందు లేనేలేదని నచ్చజెప్పి ముందుకు పక్షపాతము చేయువాదలకు అవకాశము లేకుండుటకై "పబ్లిక్ సర్వీసు కమిషను,,ను ఏర్పరచెదమని చెప్పియుండిరి. త్వరలో ఆ కమిషను (ఉద్యోగనియామకసంఘము) ఏర్పరచబడునని మొన్న మొన్ననే వార్త వచ్చినది. ఇంతేగాదు, ప్రజలలో అంకురించి నానాటికి వృద్ధిజెందుచున్న శాసన సభావిస్తరణాభిలాషయు కొద్దికాలములో సంతృప్తిపరచ బడనున్నదని అదేవార్త వలన తెలియుచున్నది. ఇట్లే ఫెడరేషను విషయమై ఇంతవరకు జరిగిన ఆలోచనల ఫలితములును ప్రజాభిప్రాయ సంతృప్తికై త్వరలో ప్రకటించబడనున్నవి.

రెండవ మహాసభతర్వాత ఆగియుండిన ప్రజాపక్షవిద్యామహాసభ గత సంవత్సరము ప్రభుత్వానుమతితో జరిగినది కన్నడ మహాసభయు, మహారాష్ట్ర మహాసభయు మళ్ళీపుడు ప్రభుత్వానుమతి పొందెను, రాష్ట్రీయులు కన్నడ మహారాష్ట్రులలో ప్రజాహితోత్సాహమునకు విశ్వాసము నొసగినవి. గతసంవత్సరము ఒసగబడిన మాన్యములు, ప్రజల మొఱల ననుసరించి ఖాల్సాలోనేగాక జాగీరులలో కూడ వర్తించునట్లు ప్రభువుగారి అనుగ్రహబలము ఉపయోగించబడినది. ఇటీవల ఆయుర్వేద ప్రోత్సాహమునకై ప్రభుత్వమునకు చేయబడిన మొఱల ఫలితముగ తుదకు గత బహిమన్‌లో హైదరిగారు నిజాంఆయుర్వేదిక్ సదర్ దవాఖానా వార్షికోత్సవ సందర్భమున ద్రవ్యసహాయ వాగ్దాన మొసగిరి. తదనుసారము ఆ సదర్ దవాఖానాకు సహాయము అనుగ్రహించబడినది. ఇదేసందర్భమున ప్రభువుగారు రజతోత్సవ నిధి నుండి శిశుచికిత్సశాల నేర్పరచుటకు ఆజ్ఞయొసంగి చిరకాలమునుండి ఈ రాష్ట్రమునకున్నలోటును పరిపూర్తిచేయనెంచిన విషయము పేర్కొనదగినది.

ప్రభువుగారి సర్వమతసమాన భావమునకు ఒక ఉదాహరణము గత సంవత్సరములో సంభవించినదిచూపెదము. ప్రభువుగారు రజతోత్సవనిధినుండి యొసగిన దానములలో మతభేదమేమియు చూపక "మదర్సై అన్వారుల్ ఉలూం" పాఠశాలకు ఎంత ఇచ్చిరో అంతే రూ ౮౦౦౦ లను వివేకవర్ధనీ పాఠశాలకుకూడ ఒసగిరి.

ఇట్టి మతభేదములేని ప్రజాసంతృప్తికారకుడగు ప్రభువరేణ్యుని జన్మదినోత్సవ సందర్భమున, వారిప్రజలందరితో బాటు మేమును వారికిని వారికుటుంబమునకును, ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక యనియు, వారిచల్లని పరిపాలనమందు ప్రజల సౌఖ్యముఅధికవేగముతో హెచ్చుచుండుగాకి యనియు ఆపరాత్పరుని ప్రార్థించుచున్నాము.

## నూతన రాజ్యాంగ సంస్కరణలు

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వము వారి ఫెడరేషను విచారణకమిటీ యొక్క అధ్యక్షులగు హైదరిగారు అక్బరలీఖాన్, నరసింగరావుగారికు గత బహిమన్‌లో చెప్పిన సమాధానమందు చేసిన వాగ్దానము ప్రకారము, ఇంతవరకుజరిగిన ఫెడరేషను సంప్రతింపుల ఫలితము త్వరలో ఎల్లోబుక్ (పసుపుపచ్చ) పుస్తకము ద్వారా ప్రజలకు వెల్లడి చేయనున్నది.

ఇదేసందర్భమున రాష్ట్రమునందు నిర్బంధోచిత ప్రాథమికవిద్యను ప్రథమమున ఒకచోట ప్రారంభించి క్రమక్రమముగా ద్రవ్యము సమకూరినకొలది రాష్ట్రమంతటికిని విస్తరింపజేయుటకు ప్రభుత్వము వారు సంకల్పించి యున్నారు.

మరియు పరిశ్రమాభివృద్ధికై ఒక ప్రణాళిక తయారు చేయబడినది, ఆలోచనలో నున్నది. హైద్రాబాదు స్టేట్ బ్యాంకు నేర్పరచి, గ్రామముల ఋణబాధ తగ్గించుటకును, పరిశ్రమలకు సహాయ మొసగుటకును ప్రయత్నములు చురుకుగా జరుగుచున్నవి.

ప్రభుత్వోద్యోగములను నిష్పక్షపాతముగ పంచిపెట్టుటకై పబ్లిక్ సర్వీస్ కమిషను నేర్పాటుచేయు విషయమైగూడ ఆలోచనలు జరుగుచున్నవి

అన్నిటికంటె ముఖ్యమగు పరిపాలనా విధాన సంస్కరణమును గూర్చి గూడ ఆలోచనలు జరుగుచున్నవి. ప్రజాభిప్రాయము సక్రమమార్గమున ప్రభుత్వమువారు తెలిసికొనుటకు అనుకూలించునట్లు విధానము నేర్పరచు సంకల్పించియున్నారు.

## మెకంజీ ప్రణాళిక అమలు

మెకంజీ ప్రణాళిక ప్రభుత్వమువారిచే సూచించబడిన మార్పులతో ప్రభువుగారి ఆమోదము బడసినదిగదా! ఆ ప్రణాళిక ప్రకారము ఏర్పరచవలసియుండు సెకండరీవిద్యాసంఘము ప్రభువుగారి సోదరులును, కొంతకాలమునుండి జాగీర్దారు కళాశాలా నిర్వాహక సంఘమున కధ్యక్షులునగు సాహెబ్జాదా నవాబ్ బసాలతు జాహ్ బహదర్ గారి అధ్యక్షతన ప్రభుత్వమువారిచే ఏర్పాటు చేయబడినది. దాని ప్రథమసమావేశము ౨౫ ఆగస్టు ౧౯౩౭ నాడు శాసన సభాభవనమందు జరిగెను.

ఈ సమావేశమందు విద్యాశాఖ మంత్రి మెహిదియార్ జంగ్ గారు ఉపన్యసించుచు చాల ముఖ్యవిషయములను ప్రకటించిరి ఆ అంశములను తెలిపెదము. క్రొత్తవిధానము ప్రకారము సెకండరీవిద్య పూర్వమువలె ౧౦ ఏండ్లు గాక ౧౧ ఏండ్లైనది. అందు ఏడేండ్లు ప్రాథమికవిద్య. ఈవిద్యలో సైన్స్, సినిమా మున్నగునవి ఉపయోగించ బడును. పారిశుద్ధ్యము, వ్యవసాయము మున్నగువాటికి సంబంధించిన సులభ విషయములు నేర్పబడును. మాధ్యమిక విద్య రెండేండ్లును, ఉన్నతవిద్య మూడేండ్లును ఉండును. మాధ్యమికవిద్యలో ఉపాధ్యాయులు విద్యార్థులు ఎవరెవరు ఏయేశక్తికి పనికివత్తురో గమనించుచుండగలరు. విశ్వవిద్యాలయ విద్యకు అర్హులు కానివారు సాంకేతికవిద్య నేర్చుకొనుటకు పంపబడుదురు. ఈ సాంకేతిక విద్య నేర్పాటుచేయు పని ఖాన్ ఫజల్ మహమ్మద్ ఖాన్ గారి కప్పగించబడినది. అన్ని పారిశ్రామికవిద్యలను ఏర్పాటు చేయుట కష్టము గనుక పారిశ్రామిక శాఖవారును వ్యవసాయ శాఖవారును కలిసి రాష్ట్రములో ఏయేపరిశ్రమలకు ఎంతమంది అవసరమగుదురో కనుగొని తెల్పుదురు, అంతమందికే అవసరమగు సాంకేతిక విద్యలు నేర్పబడును.

మదరాసు విశ్వవిద్యాపీఠము ఉస్మానియా మెట్రిక్‌ను అంగీకరించినది గనుక హెచ్.యస్.యల్. సి. పరీక్షను ఉస్మానియా మెట్రిక్ పరీక్షను తీసివేసి ౯వతరగతి పరీక్ష యనియు, ౧౧వతరగతి పరీక్ష యనియు రెంటిని ఏర్పరతురు కాని నైజాం కాలేజి మదరాసు విశ్వవిద్యాపీఠమున కనుబంధముగా నుండుటవల్ల దానికి తగినవిద్య నేర్పుటకు కొన్ని క్లాసు మాత్రమే అనుమతినిచ్చి అక్కడి విద్యార్థులకు "నైజాంకాలేజి ప్రవేశపరీక్ష" యనునది జరిపెదరు. ఈపరీక్ష సెకండరీ విద్యాసంఘము చేతనే జరుపబడును.

స్త్రీలకు ప్రత్యేకముగ తగిన కుట్టుపని, గృహనిర్వహణము మున్నగునవి నేర్పు ఏర్పాట్లను, ప్రత్యేక వ్యాయామపు ఏర్పాట్లను చేయుటకు హైదరి సతిగారి అధ్యక్షతన ఒక స్త్రీసంఘ మేర్పరచబడినది. ఆమెకు మిస్ అమీనాపోప్, ఈంగ్లర్ సతి ఇరువురు సహాయులుగ నుందురు, సెకండరీవిద్యా సంఘకార్యదర్శి అలీ అక్బరుగారు ఆసంఘ సమావేశములకు హాజరగుచు తీర్మానములను అధికారరీత్యా కాగితములద్వారా గాక సమక్షములో విద్యామంత్రిగారికి నివేదించుచుందురు.

ప్రాథమికవిద్యను నిర్బంధముచేయు విషయమై త్వరలో ప్రధానమంత్రిగారు ఒక ప్రకటన చేయనున్నారు. ఇవి మెహిదియార్జంగు గారు ప్రకటించిన అంశములు.

తర్వాత బసాలత్ జాహ్ బహదర్ గారు విద్యావిధాన సంస్కరణ చరిత్రను వర్ణించి, సంస్కరణావసరము ను సమర్థించుచు ఉపన్యసించిరి.

### పురపాలక సంఘపు ఎన్నికలు

ఎన్నికలు చాల ఉత్సాహముతో జరిగినవి ప్రతిపాలకుల సీటులలోను పోటీ బలముగా నుండెను. కాని దౌర్జన్యములు, అశాంతి లేకుండ నగరరక్షకశాఖాధికారి, మునిసిపల్ కమిషనర్లు కట్టుదిట్టములు చేసిరి.

# లక్ష్మీ

## ముందునకు నడచుచున్నది.

వాల్యుయేషన్ ఫలితములు

30 ఏప్రియల్ 1936 కు ఆఖరగు 4 సంవత్సరముల అంతమందు

తెలియజేయబడిన బోనసు

| | | |
|---|---|---|
| పూర్తిజీవితమునకు | ర్పు **20** | వెయ్యికిసం॥ రమునకు |
| ఎండోమెంటు | ర్పు **16** | ,, ,, |
| వ్యాపారము | **8,00,00,000** | లకు మించినది |
| నిధి | **90,00,000** | లకు మించినది. |

మ. ఘ. వ. నైజాం రాష్ట్రమునకు

-చీఫుఏజంట్లు కావలయును-

దరఖాస్తులు పంపుడు.

లక్ష్మీయిన్షూరెన్సుకంపెనీ లిమిటెడ్

బ్రాంచి:— ఫోర్టు, బొంబాయి.

తీరికలో ధనమార్జింపుడు

మెషీన్ మీద పూల నగిషీపని నేర్చుకొనుడు.

రుసుములు సరసము.

స్త్రీలకు ప్రత్యేక ఏర్పాట్లు

శ్రీమతి యం. సి. పి. ఫెర్నాండజ్
సాదుబాయి లేను,
తోపులబట్టి, హైదరాబాదు-దక్కన్.

# కొత్తనీరు, పాతనీరు

కొత్తనీరువచ్చి పాతనీరును కొట్టివేస్తుంది. ప్రతియేటా వరదల కాలములో యిది జరుగుతూ వుంటుంది.

అదేవిధముగా ఉష్ణము, తీవ్రత, తీక్ష్ణతగల క్రొత్త నెత్తురు వస్తే పాత నెత్తురుయొక్క బలహీనత, మాలిన్యము, అంతా మాయమై పోతుంది. జీవనము సుఖప్రద మౌతుంది.

క్రొత్త నెత్తురును అంత యెక్కువగ నీయగలది అమృత. అమృత సేవిస్తే మీకు క్రొత్త నెత్తురు పడుతుంది. దానితో క్రొత్త జీవనము కూడ లభ్యమౌతుంది.

క్రొత్తరక్తానికి

అమృత

కేసరీకుటీరం

ఎగ్మూరు మద్రాసు.



## ఆనందమును పొందుటకు

ఒక కప్పు

# కాఫీని

## ఇండియా కాఫీ హౌసు

అబిద్ రోడ్, హైదరాబాదు,దక్కన్ లోత్రాగుడు

ఒక కప్పు కాఫీ 1 అణా

భోజనము. ఫలహారములు సరసమైన ధరలలో
శుభ్రముగాను, సౌఖ్యముగాను ఉండును.

మనోహరమైన

తలవెండ్రుకలకొరకు



# KAMINIA OIL

అసమానమైనది.

Re 1/-

(రిజిష్టర్డు)

దాని వెంబడి సూచనల ప్రకారము దీనినుపయోగించి మీ తలకట్టుయొక్క అభివృద్ధిని గమనింపుడు. కామినియా నట్టినూనెవలెగాక, వెండ్రుకలకు ఆహారముగా పనిచేయును.

మూడు సీసాల ఖరీదు 2—10—0 పోస్టేజి ప్రత్యేకము.

అర్ధణా పంపినయెడల ఉచిత సాంపిల్.

ఓటో దిల్ బహార్ (రిజిష్టర్డు)

హృద్యమైన సుగంధద్రవ్యము.

ఎల్లప్పుడు దీని నుపయోగించుటచే మీమనస్సు ఆనందముగాను, తాజాగాను యుండును. ఒకచుక్క మీపరిసరములను స్వర్గతుల్యముగా జేయును.

ఓటో మే బ్లూం (రిజిష్టర్డు)

సుగంధ పుష్పములనుండి తయారుచేయబడిన అతిమనోహరమైన అత్తరు.
పావు ఔన్సు సీసా 1—4—౦ ఒకడ్రాంబుడ్డి ర్పు 0—12—0 వి.పి.చార్జి వేరు.
ఎట్టి ఉచితసమూనాకైనను 0—2—0 బిళ్ళలు పంపుడు.

దిఆంగ్లోఇండియన్ డ్రగ్ కెమికల్ కంపెనీ బొంబాయి2

The only Leading National Bi - weekly of the whole Andhra Desa

# GOLKONDA PATRIKA

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Voume 12 | HYDERABAD - DECCAN | Monday 6 September 1937 | Number 34

# ZANDU

## Pharmacuetical

Works Ltd., P. O. Box 5513, Bombay

ఆరోగ్యబలములకు

స్త్రీలు

జాండువారి

అశోకారిష్టము వాడదగును.

అదికుసుమరోగములను
స్త్రీల ఇతరరోగములకును
నమ్మకముగ కుదుర్చును.

నూతనజీవనోత్సాహములకు

జాండువారి

కేసరీజీవన్ వాడుడు.

శరీరమున కంతటికివిశ్రాంతికలిగించు
రుచ్యమైన పుష్టికరాహారము.

ఇది చాలవిలువగల వస్తువులతో తయారుచేయబడినది. గుణమునేగాక మంచి రుచియును, సువాసనయు గలిగి పలువురచే యోగ్యతాపత్రికలను బొందియున్నది. ¼ తులము మొదలు 1 తులమువరకు దినమునకు రెండుపూటలు పాలతో సేవించిన మంచి వీర్యపుష్టిని, బలమును, ఉత్సాహమును, కలిగించును. వ్యాధిగ్రస్తులై శరీరము కృశించియున్నవారికి వెంటనే రక్తమువృద్ధిచేసి మంచి దేహకాంతిని కలిగించును. క్షయవ్యాధికి చాల ముఖ్యమైనది. వృద్ధుల బలహీనతకు బాగుగా పనిచేయును.

జాండుఫార్మస్యూటికల్ వర్క్సు, లిమిటెడ్, బొంబాయి 8.

నిజాంరాష్ట్రమునకు సోల్ ఏజంట్లు:—

డి. జె. పారెఖ్ అండుకో,

జుమ్మామస్జిద్ వద్ద, సికింద్రాబాదు (దక్కన్)



క్యాస్టొఫీన్: క్యాస్టర్ ఆయిల్ చాకొలేట్సు

ఆముదము త్రాగునప్పుడు పిల్లలకు ఎంతదుఃఖము కలుగును! ఇకముందుపిల్లలకు ఆముదము ఇయ్యవలసిన పనిలేదు. ఏలయనగా శాస్త్రజ్ఞులు ఆముదమునకు బదులుగా "క్యాస్టొఫీన్ క్యాస్టర్ ఆయిల్ చాకొలెట్సు" అను పేరుగల ఒక శ్రేష్ఠమైన పదార్థమును సిద్ధము చేసియున్నారు.

నమ్మకమైన వీటిని పుచ్చుకొనుట మిఠాయివలె తియ్యగానుండును. సౌమ్యముగా నుండియు, సంపూర్ణమగు గుణమును ఇచ్చునని డాక్టరులు, నర్సులు వీనిని పొగడియున్నారు; ఇవి చిన్నపిల్లలకు ఎట్లో పెద్దవారికికూడ అట్లే లాభప్రదములు. ఎప్పుడు ఒక సీసా దగ్గర ఉంచుకొనవలెను.

ఏజంట్లు; కింగ్ అండుకో కెమిస్టు-హైద్రాబాదు-దక్కన్.

# CASTOPHENE

## CASTOR OIL CHOCOLATES

## జాగ్రత్తగల ప్రయాణికుడు బాధ్యతనువహింపడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటనుంచుకొనుట బాధాకరమును అపాయకరమున్నైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచినయెడల

సెంట్రల్ బ్యాంకుయొక్క
ట్రావెలర్సు చెక్కులను ఉపయోగింపుడు

అవి:—

1. నష్టముకలుగకుండ కాపాడును.
2. రొక్కముకంటె సులభముగా తీసికొనిపోవచ్చును.
3. 25,50 100 రూపాయిల మొత్తములలో దొరకును.
4. హైద్రాబాదులోను ముఖ్యమైన బ్రాంచీలలోను దొరకును. ఏబ్రాంచికైనను ఆఫీసులో పేమెంటు నగదు ఇయ్యబడును.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K. Balakrishna Reddy